శ్రీరామాయనమః.







# శ్రీవైఖానస ధర్మచంద్రిక.

## వైఖానసాగమోక్త దేవలకత్వ నిరాకరణమ్.

ఇది

పిఠాపురసంస్థానాధీశ్వరులైన మహారాజరాజశ్రీ

శ్రీరాజా వత్సవాయి శ్రీరాయజగపతిరాజుబహద్దరువారిచే

వ్రాయబడినవి.

వారియనుజ్ఞనుపొంది

మొదటి కూర్పు 1000.

రాయవరము,

శ్రీ మేరీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడి

కొమరిపాలెము,

శ్రీమాన్ పెద్దింటి నారాయణాచార్యులువారివలన ప్రకటింపబడియె.

1914-ఆగష్టు.








శ్రీరామాయనమః.

---

రాజమాన్య రాజపూజితులయిన మహారాజశ్రీ, శ్రీరాజావత్సవాయి రాయ జగపతి రాజబహద్దరుగారి దివ్యసముఖమునకు—

కృష్ణాజిల్లా- భీమవరంతాలూకా- చెరుకుమిల్లి గ్రామకాపురస్థుడు దాట్లపెదమంగరాజు నిత్యం అనేకనమస్కారములుచేసి వ్రాయంగల విన్నపములు.

విశ్వావసునామసంవత్సర పుష్య శు॥ ౧౧ స్థిరవారంవరకు ఇచ్చట చెరుకుమిల్లిలో కుశలం, అచ్చట తమనిత్యసంతోషాతిశయములును వ్రాయించి కృపచేయించకోరుచున్నాను. త॥ మా గ్రామములో నూతనముగ విష్ణ్వాలయము కట్టించి వైఖానసులను స్థలజ్ఞులుగా నేర్పాటు జేయించి వైఖానససూత్రముచేతనే ప్రతిష్ఠచేయించినాము.

వైఖానసుల సూత్రపద్ధతి యిదివరకు మాకు తెలియదు. ఈచుట్టుపట్ల కొన్ని గ్రామాదులలో వైఖానసులకు విష్ణుస్థానము ఋణము ఇస్తున్నారు. మేమున్ను, ఆప్రకారమే ఇచ్చుటకు యత్నించగా యీగ్రా

షు పురోహితులు వారికి విష్ణుపాత్రి యివ్వకూడదనే హంశములు కొంద రికి చెప్పి ఆపుదల చేశినారు.

అందుకు యిపుడు ముఖ్యముగా తమపేర వ్రాసుకొనే మనవి యేమనగా.

మీ ప్రాంతమందుగాని మీగ్రామంలోగాని క్షత్రియులు అబ్ది కమురోజున వైఖానసులకు విష్ణుపాత్రి యిచ్చుచున్నారా లేదా?

గ్రహణాదులయందుగాని, శాంతులయందుగాని, వారికి దానము లువగైరాలు యిచ్చుట ఉన్నదా లేదా? వారివల్ల క్షత్రియులుఆశీర్వచన మును పొందవచ్చునా కూడదా? ఈహంశములను తమవంటి జమీందా లను తెలుసుకొని మేము అవలంబించ వలయునని కోరికతో యింతగా వ్రాసుకొన్నాము. కాబట్టి తమ సంస్థానములోగాని, యితరచోట్లగాని వైఖానసులకు జరుగు మర్యాదలను వ్రాయించగలందులకు మిక్కిలి ప్రార్థించుచున్నాము. తమరు స్వతహా చాలాపండితులనియు క్షత్రియులలో తమకు విశదముగాని హంశములు వేరుండవని తమరు చేయు ఆచారము లను మేము అవలంబించవలెననికోరికతో వ్రాసుకొన్నాము. గనుకయిం దుకు వెంటనే ఉత్తరువు దయచేయించగలందులకు మిక్కిలి కోరు చున్నారము.

దివ్యచిత్తమునకు తేవలెను.

ది 6—1—06 సం॥ రం

దాట్లపెద మంగరాజు వ్రాలుఅని యున్నది.

---



శ్రీమత్సకలగుణసంపన్నులైన శ్రీమహామేరుసమానధీరులయిన శ్రీదాట్ల పెదమంగరాజుగారికి రాజావత్సవాయి రాయ జగపతిరాజు విన్నపములు.




---

ఇచట పెద్దాపురంలో క్షేమం. అచటి యోగక్షేమములను తరుచు వ్రాయించవలెను. తా॥మీరు జనవరి 6 వ తారీఖున వ్రాయించిన యుత్తర మందినది. మీగ్రామములో నూతనముగ ఆలయము కట్టించి వైఖానససూత్రప్రకారము శ్రీవిష్ణుప్రతిష్ఠచేయించినామనివ్రాయించినారు. ఇందుకు చాలా సంతోషించదగినది. మీసమీపగ్రామములలో వైఖానసులకు విష్ణుస్థానమునకు ఋణము ఇవ్వడపు ఆచారమున్నదనిన్ని మీగ్రామపురోహితులు వారికి ఋణం యివ్వకూడదని ఆటంకపెట్టినారనిన్ని వ్రాయించినారు. నిషిద్ధమైనగ్రామయాజకత్వవృత్తిని అవలంబించిన గ్రామపురోహితులు పూజ్యమైన శ్రీవిష్ణుదేవయాజకత్వమును అవలంబించిన వైఖానసులు పూజ్యులుకారని నిషేధించినందుకు వింతగానున్నది. ఈప్రాంతములయందు చాలాగ్రామములలో విష్ణుస్థానమునకు పాంచరాత్ర వైష్ణవులకుగాని వైఖానసవైష్ణవులకుగాని ఋణమివ్వడమాచారమైయున్నది. మాకుటుంబములోనున్న రామచంద్రపురంతాలూకా కోలంక-గ్రామములో మామేనమామగారి కుటుంబములోనున్న వైష్ణవమతమునవలంబించిన మరికొన్ని కుటుంబములలోనున్న మూడుస్థానములకున్ను వైష్ణవులకేఋణమివ్వడమాచారమైయున్నది. మాకుటుంబములో

పాంచరాత్రవైష్ణవులు వైఖానసవైష్ణవులనే భేదము లేకుండా యీరెండుస్థానములకున్ను ఋణమివ్వడ మాచారమైయున్నది. వైఖానసవైష్ణవులకు విష్ణుస్థానమునకే ఋణమివ్వవలెననే నియమము లేకుండా విశ్వేదేవస్థానమునకుగాని పితృస్థానమునకుగాని ఋణమివ్వడం కలిగియున్నది. పైతృకములలోగాని గ్రహణాదిపుణ్యకాలములలోగాని శాంతికర్మలలోగాని పౌష్టికములయినవివాహాదిశుభకర్మలలోగాని వీరిని పూజించుట ఆచారమైయున్నది. వీరిపూజ్యతనుగూర్చి యిందుతో పంపించినపత్రికవల్ల మీకుస్పష్టముగావిశదముకాగలదు. గనుక తిరుగా విస్తరించ లేదు. ఈయుత్తరము మీకందినట్టుగానే తిరుగా జవాబు వ్రాయించవలెను. విష్ణుమతాభిమానముగల మనబంధువులకు నీపత్రికావచనములను విశదీకరించవలెను. మీక్షేమ సమాచారములను తరుచు వ్రాయించుచుండవలెను.

చిత్తగించవలెను. శ్రీ. శ్రీ. శ్రీ.

ది 4 ఫిబ్రవరి 1906 సం॥రం

వ॥ రాజా రాయ జగపతి రాజు వ్రాలు

అని వున్నది.





శ్రీరామాయనమః.

# శ్రీ వైఖానస ధర్మచంద్రిక.



పిఠాపురనివాసస్థులయిన మహారాజ రాజశ్రీ శ్రీరాజా వత్సవాయి శ్రీరాయ జగపతిరాజు బహద్దూరుగారు కృష్ణా జిల్లాభీమవరం తాలూకా చెరుకుమిల్లి నివాసస్థులయిన శ్రీదాట్ల పెకయ్యంగరాజుగారి పేర శ్రీవైఖానస పూజ్యతనుగూర్చి వ్రాయించిన పత్రిక.

{ స్మృతిరత్నాకర ధర్మశాస్త్రే అథ
సూత్రాణి అగ్నివైశ్యసూత్రే }

అథాతస్సూత్రగణాన్వ్యాఖ్యాస్యామో బోధాయనమాపస్తంబం సత్యాషాఢం ద్రాహ్యాయణమాగస్త్యం శాండిల్యమాశ్వలాయనం శాంభవీయం కాత్యాయనమితి నవానిపూర్వసూత్రాణి, వైఖానసం శౌనకీయం భారద్వాజ మాగ్నివైశ్యం జైమినీయం వాధూలం మాధ్యందినం కౌండిన్యం కౌషీతకమితి నవాన్యపరసూత్రాణి, అష్టాదశసంఖ్యా తాశ్శరీర సంస్కారా ఇతి.

తా॥ బోధాయనసూత్రము, ఆపస్తంబసూత్రము, సత్యాషాఢము ద్రాహ్యాయణము, ఆగస్త్యము, శాండిల్యము, ఆశ్వలాయనము, శాంభవీయము, కాత్యాయనము, అనియీతొమ్మిదిపూర్వసూత్రములు. వైఖానసము, శౌనకీయము, భారద్వాజము, అగ్నివేశ్యము, జైమినీయము, వాధూలము, మాధ్యందినము, కౌండిన్యము, కౌషీతకము, అని యీతొమ్మి

ది అపరసూత్రములు వేరశిపమనెనిమిది. శరీరసంస్కారార్థమై చేయ్యబడి నసూత్రములు—

{ శ్రీతేషాంసూత్రాణాంమధ్యే వైఖానససూత్రం ప్రశం
శ్రీబ్రహ్మాండపురాణాదిషూక్తాః శ్లోకాఃలిఖ్యంతే. }

తా॥ యీసూత్రములలో వైఖానససూత్రమువిషయమై శ్లోకముల నువ్రాయుచున్నాము.—

శ్లో॥ వైఖానసంపాంచరాత్ర మితిద్విస్త్వాగమాంవ్రజా।
తత్రవైఖానసంముఖ్య తమమిత్యుచ్యతేబుధైః॥

తా॥ వైఖానసము, పాంచరాత్రము, అనివిష్ణ్వాగమములు, రెండు. ఈ రెండింటిలో వైఖానససూత్రము ముఖ్యమని పండితులచే చెప్పబడు చున్నది.

శ్లో॥ వైఖానసస్యసూత్రస్య చాగ్నేశ్శ్రామణకస్యచ।
నారాయణస్య వేదస్యమహాత్మ్యంనావబుధ్యతే॥

తా॥ వైఖానససూత్రముయొక్క, శ్రామణకాగ్నియొక్క, నారాయణ మనే వేదభాగముయొక్క మహిమవివరింపనశక్యమైనది.

శ్లో॥ యథాసర్వేషు వేదేషు సామవేదప్రశస్యతే॥
తథాసూత్రేషుసర్వేషు సూత్రమేతత్ప్రశస్యతే॥

తా॥ అన్ని వేదములలో సామవేదమువలెనే, అన్నిసూత్రములలో నీ సూత్రము శ్లాఘింపబడినది.

శ్లో॥ అగ్నిర్వైఖానసంసూత్రం విష్ణుర్వేదాశ్చశాశ్వతా
గాయత్రీవైష్ణవావిప్రా స్సప్తైతేతిపవిత్రకాః॥

తా॥ అగ్ని హోత్రము, వైఖానససూత్రము, శ్రీవిష్ణుదేవుడు, శాశ్వతమైనవేదములు, గాయత్రీమంత్రము, విష్ణుభక్తులు, బ్రాహ్మణులువీరే డ్వురు మిక్కిలి పవిత్రులు.

— కాలమాధవీయే, ఉపోద్ఘాత ప్రకరణే —

శ్లో॥ వైఖానసాద్యాగమోక్త దీక్షాం ప్రాప్తోహి వైష్ణవః॥

తా॥ వైఖానసాగమోక్త ధర్మమునవలంబించువారు వైఖానస వైష్ణవులు.

— స్మృతి ముక్తాఫలే —

శ్లో॥ పాంచరాత్రాద్యాగమోక్తదీక్షాం ప్రాప్తస్తు వైష్ణవః॥

తా॥ పాంచరాత్రాగమోక్తదీక్షను వహించినవారు పాంచరాత్ర వైష్ణవులు.

— వైఖానస వైష్ణవ శ్రేష్ఠతను గూర్చి శ్లోకములు —

{ శ్రీబ్రహ్మాండపురాణే అర్థపంచక వివరణే
అర్చావతారసూచక ద్వితీయాధ్యాయే }

శ్లో॥ శబ్దతాత్పర్యవిజ్ఞాన విహీనత్వాదసూయయా।
విత్తార్థంపూజయంతీతి యాజకాన్ దూషయంతియే॥
తేషాంతునరకేవాసో యావదాచంద్రతారకం॥

తా॥ శబ్దార్థాభిప్రాయమును తెలియక అసూయచేతవిత్తమునుగ్రహించి దేవునిపూజించుచున్నారని అర్చకులనెవరు నిందింతురో వారికి ఆ చంద్రతారకముగా నరకమందు నివాసముకలుగును.

శ్లో॥ యాజకాఏవమద్భక్తామచ్ఛరీరం హియాజకాః॥
యేజనాస్తాన్వినిందంతి భవంతిమమనిందకాః॥

తా॥ అర్చకులే మాభక్తులు, నాశరీరమువంటివారున్ను, వారినినిందించినవారు నన్ను నించినవారుగా నెంచబడుదురు, అనిభగవద్వచనము.

శ్లో॥ యేపూజయంతిమద్భక్తాన్యాజకాన్ సుసమాహితాః।
మమైవపూజాంతాంబుద్ధ్వా దాస్యామిపరమంపదం॥

తా॥ నాభక్తులయిన అర్చకులను శ్రద్ధగా పూజించినవారికి ఆపూజ నాదిగాభావించి వారికి నాలోకమునిచ్చెదను.

శ్లో॥ అన్నవస్త్రం ధనంవాపి యాజకానాం దదాతియః।
తస్మైమేవహిందత్తంస్యా ద్వర్ధతేవటబీజవత్।
తస్మైదాస్యామ్యహంవిప్ర తత్ఫలేనపదంమమ॥

తా॥ అన్నముగాని, వస్త్రముగాని, ధనముగాని, మాయర్చకులకు యివ్వబడినది నానిమిత్తమే యివ్వబడినదగును. ఆ దానఫలమువటబీజము వలె వృద్ధిబొందును ఆదాతకు నాలోకమునిచ్చెదను.

శ్లో॥ మద్యాజకానాం యోదద్యా న్మహాదానాదికంనరః।
ఫలంకోటిగుణందత్వా దదామిపరమంపదం॥

తా॥ ఏనరుడు మాయర్చకులకుమహాదానాదికమును యిచ్చునో ఆ దాతకు మేముకోటిగుణముగా ఫలమునివ్వడమే కాక మాపరమపదమును కూడా యివ్వగలము.

శ్లో॥ అర్చకంతోషయేద్విష్ణుం యస్తోషయితుమిచ్ఛతి।
తుష్టేర్చకేజగన్నాథ స్తుష్టఏవనసంశయః॥

తా॥ విష్ణుప్రసాదము కోరినవాడు అర్చకుని సత్కరింపవలెను. అర్చకుడు సంతుష్టుడైతే జగన్నాథుడు సంతుష్టుడగును.

ఈపైనవ్రాసినశ్లోకములవల్ల వీరిసూత్రముశ్రేష్ఠమైనదని, ఈ సూత్రస్థులు పూజ్యులని తెలియగలదు. వీరికి దేవలకత్వములేదు. దేవలకులు యెవరనగా:—

—విష్ణుధర్మోత్తరే—

శ్లో॥ చండికాయాశ్చదుర్గాయా జ్యేష్ఠాయాభైరవస్యచ।
రుద్రస్యపూజకాయేతు తేవై దేవలకాస్మృతాః॥

తా॥ చండికను, దుర్గను, జ్యేష్ఠను, భైరవుని, రుద్రదేవుని, పూజించువారు దేవలకులని చెప్పబడుచున్నారు.

శ్లో॥ "దేవాజీవస్తుదేవలః" అనే సామాన్యవచనమునుబట్టి దేవపూజచేసినవారుఅందరున్ను దేవలకులేయని, సాత్వికాది పురాణవివేకము

లేక, తామసపురాణములను మాత్రముచూచి కొందరు సామాన్యపండితులున్ను, విష్ణుమతద్వేషమునుబట్టి, మరికొందరున్ను, వీరిని దేవలకులని నిందించుచు ఆధునికగ్రంథములలో కొన్ని నిందావచనములు వ్రాసియున్నారు. "దేవాజీవస్తుదేవలః" అనే సామాన్యవచనముచేత సామాన్యులకు భ్రాంతికలుగుననే యుద్దేశ్యముచేతనే వృద్ధహారీతాది మహర్షులు యీభ్రాంతిని వారణార్థము స్పష్టముగా వ్రాసియున్నారు. ఆవచనములెవ్వియనగా:—

—వృద్ధహారీతస్మృతౌ

శ్లో॥ వైఖానసాస్తుయే విప్రాః హరిపూజనతత్పరాః।
న తే దేవలకాః ప్రోక్తాః హరిపాదాబ్జసంశ్రయాత్॥

తా॥ శ్రీహరినిపూజించే వైఖానసబ్రాహ్మణులు శ్రీహరి పాదాబ్జసంబంధమువలన దేవలకులు అని చెప్పబడరు.

—స్మృతిరత్నాకర ధర్మశాస్త్రే—

శ్లో॥ యేనకేనప్రకారేణ విష్ణోరారాధనంపరం।
తస్మాద్దేవలకత్వంతు నవిష్ణువిషయేక్వచిత్॥

తా॥ యేప్రకారముచేతనయినను, అనగా ధనముపుచ్చుకుని గాని పుచ్చుకొనకగాని విష్ణ్వారాధనముచేయుట పరమశ్రేయస్కరము. అందువల్ల విష్ణ్వారాధనవిషయములో దేవలకత్వము లేదు.

—సచ్చరిత్రసుధానిధౌ—

శ్లో॥ వత్సరత్రయమర్థార్థం యఃపూజయతి దేవతాం।
వినానారాయణందేవం సహిదేవలకస్స్మృత॥

తా॥ శ్రీనారాయణదేవునివినాగా ఇతరదేవతను మూడు సంవత్సరములు ధనాపేక్షచే పూజించువారు దేవలకు లనబడుచున్నారు. శ్రీనారాయణదేవుని పూజించువారికి దేవలకత్వదోషము లేదు.

సామాన్యులకు భ్రాంతినివారణనిమిత్తము పూర్వమహర్షులు ఇట్లా పరిహారముగా విశదీకరించినారు.

తామసపురాణములలోనున్ను, వాటిననుసరించిచేసిన ఆధునిక గ్రంథములలోనున్ను వ్రాసియున్న నిందావాక్యములు యీపయి మహాదుశ్లోకములవల్లనున్ను, పరిహరింపబడుచున్నవని గ్రహించవలెను.

—పాద్మేసాత్వికాదిపురాణవిభాగః—

శ్లో॥ వైష్ణవంనారదీయంచ తథాభాగవతంపరం।
గారుడంచతథాపాద్మం వారాహంశోభనంస్మృతం।
సాత్వికానిపురాణాని శోభనానివరాననే॥

—సాత్వికపురాణములు—

తా॥ 1 వైష్ణవము. 2నారదీయము. 3భాగవతము. 4 గారుడము, 5 పాద్మము. 6 వారాహము. యీపురాణములుసాత్వికపురాణములు

—రాజసపురాణములు—

శ్లో॥ బ్రహ్మాండంబ్రహ్మకైవర్తంమార్కండేయంతథైవచ।
భవిష్యద్వామనంబ్రాహ్మం రాజసానినిబోధమే॥

తా॥ 1బ్రహ్మాండపురాణము. 2బ్రహ్మకైవర్తము. 3మార్కండేయము 4 భవిష్యోత్తరము. 5 వామనము. 6 బ్రాహ్మం. యీపురాణములు రాజసపురాణములు.

[ తామసపురాణములు. ]

శ్లో॥ శైవమాగ్నేయకంచైవ లైంగంస్కాందంతథైవచ।
కౌర్మంచైవ తథామాత్స్యం తామసానిప్రచక్షతే॥

తా॥ 1 శైవపురాణము. 2 ఆగ్నేయపురాణము. 3 లింగపురాణము. 4 స్కాందపురాణము. 5 కూర్మపురాణము. 6మత్స్యపురాణము. యివి తామసపురాణములు.

సాత్వికపురాణములలో విష్ణూపాసనోర్ధ్వపుండ్ర చక్రధారణాది ధర్మములనుగూర్చి స్తుతివాక్యములున్ను, రుద్రార్చనతిర్యక్పుండ్రలింగ ధారణాది ధర్మములనుగూర్చి నిందావాక్యములున్ను, విశేషముగా నున్నవి.

తామసపురాణములలో రుద్రార్చన తిర్యక్పుండ్రలింగధారణాదికమును గూర్చిస్తుతివాక్యములున్ను. చక్రాంకణమునుగూర్చిన్ని అర్చకులను గూర్చిన్నీ నిందావాక్యములు కలిగియున్నవి.

సాత్వికధర్మములుప్రాజ్ఞులకుగ్రహించతగినవిన్ని తామసధర్మములు వర్జించతగినవిగానున్నవి.

( విష్ణుధర్మోత్తరే. )

శ్లో॥ మధ్యమోరాజసోధర్మః తామస స్త్వధమస్మృతః।
సాత్వికస్తూత్తమోజ్ఞేయ స్తస్మాత్సాత్వికమాచరేత్॥

తా॥ రాజస ధర్మములు మధ్యమములు, తామస ధర్మము లధమములు, సాత్వికధర్మము లుత్తమమైనవి గనుక సాత్వికధర్మముల నవలంబించవలయును.

రాజస తామసపురాణ ధర్మములున్ను, సాత్వికపురాణధర్మములకు వ్యతిరేకించకుండా వున్నంతమట్టుకు గ్రాహ్యములు. వ్యతిరేకధర్మములు త్యాజ్యములు. సాత్వికశాస్త్రోక్తధర్మముల నవలంబించిన వారు పూజ్యులు.

సాత్వికధర్మముల నవలంబించినవారు పూజ్యులనుటవల్ల తామస పురాణధర్మముల నవలంబించిన తిర్యక్పుండ్రధారులు నింద్యులా యని శంక గలుగుచున్నది.

( ఇందుకు సమాధానము. )

శ్లో॥ బాహ్యమభ్యంతరంచేతి వైష్ణవం ద్వివిధంస్మృతం।
చక్రాదిధారణంబాహ్య మాంతరం హరిచింతనం॥

తా॥ వైష్ణవము: బాహ్యము, అభ్యంతరము అని రెండువిధములు. చక్రాదిధారణము, బాహ్యవైష్ణవము. హరిచింతనము, ఆంతరవైష్ణవము. ఆంతరవైష్ణవమనె హరిచింతనమువల్ల తిర్యక్పుండ్రధారులున్ను పూజ్యులై యున్నారు.

ప్రస్తుతము యీసాత్వికధర్మముల ననుసరించి, శ్రీరంగము, శ్రీవేంకటాద్రి, శ్రీకాంచీపురము, శ్రీపెరుంబుధూరు, శ్రీతిరువల్లిక్కేణి మొదలయిన స్వయంవ్యక్తాది దివ్యస్థలములలో సాత్వికాచారములయొక్క అనుష్ఠానమున్ను, అర్చకులయొక్క గౌరవమున్ను, చూచినవారికి స్పష్టముగా తెలియగలదు గనుక గ్రామపురోహితవాక్యములను విశ్వసింపక పైనవ్రాసినప్రకారం సాత్వికశాస్త్రోక్తధర్మము నవలంబించిన వైఖానస వైష్ణవులను పాంచరాత్రావలంబులయిన శ్రీవైష్ణవులనువలె పూజించడము న్యాయమైయున్నది కాబట్టి మేమున్ను వారిని పూజించుచునే యున్నాము. ఈవిషయమై యింకా అనేకధర్మశాస్త్రవచనము లున్నప్పటికి గ్రంథవిస్తరభీతిచే నింతటితో విరమించడమయినది.

4—2—06.

విశ్వావసు నామ సం॥ర మాఘ శు ౧౦ ఆదివారం.



శ్రీరామాయనమః.

# వైఖానసారోపిత దేవలకత్వ నిరాకరణం.

వైఖానసానాం దేవలకత్వమస్తీతివాదినః
వైఖానసదుష్టతావాదినః
వైఖానసానాం దేవలకత్వం నాస్తీతివాదినః
వైఖానస శిష్టతావాదినః

వైఖానసానాం దేవలకత్వమస్తివా నాస్తినేతిప్రశ్న కుత్తరముగా వైఖానసులకు దేవలకత్వం లేదని ఈక్రిందవ్రాసినప్రకారము స్మృతిరత్నాకరంలో శ్లోకములనున్ను, హారీతస్మృతి శ్లోకములనున్ను శిష్టతావాదులు వ్రాసినారు.

( స్మృతిరత్నాకరే )

శ్లో॥ ఆగమోక్తవిధాఃశ్లో। రుద్రకాద్యుపజీవకః।
శుద్ధదేవలకోనామ। సర్వకర్మవిగర్హితః।
ఆగ్నోక్తేనవిధానేన। దేవలత్వం నవిద్యతే।
తస్మాత్సర్వప్రయత్నేన। వైదికేనైవపూజయేత్॥

( అత్రిః )

శ్లో॥ వైదికేనైవవిధినా। దంభలోభవివర్జితః।
పూజయేద్భక్తితోవిష్ణుం। నహిదేవలకోనహి॥

( విష్ణుధర్మోత్తరే )

శ్లో॥ చండికాయాశ్చదుర్గాయాః। జ్యేష్ఠాయాభైరవస్యచ।
రుద్రస్యపూజకాయేతు। తేవై దేవలకాస్మృతాః॥
యేనకేనప్రకారేణ। విష్ణోరారాధనంపరం।
తస్మాద్దేవలకత్వంతు। నవిష్ణువిషయేక్వచిత్॥

( హారీతస్మృతౌ )

శ్లో॥ వైఖానసాస్తుమేవిప్రాః। హరిపూజనతత్పరాః।
నతే దేవలకాః ప్రోక్తాః। హరిపాదాబ్జసంశ్రయాత్॥

ఇట్టితావాదులీ శ్లోకములను జూచి యేవిధమైన సంకోచమూ లేకుండా, నక్షత్రసూచి, జ్యోతిశ్శాస్త్రపారంగతుల నాక్షేపించునట్లు, తన్యపుటస్యోపరిభాగలిఖిత ద్వితీయ తృతీయ పంచమ షష్ఠశ్లోకాః పూర్వపతితాః॥ అనిన్ని॥ తామువ్రాయుచోటే, పురాణశ్లోకముల కగ్రభాగమందు ఉత్తరా॥ అనిన్ని వ్రాసి కొన్ని పురాణశ్లోకములున్నూ, కొన్నికల్పిత శ్లోకములున్నూ, కొన్ని మృగ్యమూలశ్లోకములున్నూ, వ్రాసినారు. యెంతగొప్పపండితులైనను, హారీతాదిస్మృతిశ్లోకముల నాక్షేపింపజాలరు. యీదుష్టతావాదులు తన్యపుటస్యోపరి। అనివ్రాయుటచేతను, ఏతచ్ఛబ్ద తచ్ఛబ్దభేదమున్నూ, ఉత్తరా। అనివ్రాయుటచేత లింగవచనభేదము లున్నూ, కనిపెట్టలేని పండితంమన్యులని స్పష్టమగుచున్నది. రత్నపరీక్ష తెలియనివారికి మరకతమాణిక్యములకంటె పచ్చరాయి మంచిదిగా తోచును. గనుక వీరలీలాగునవ్రాయుట యుచితమే. యెంతగొప్ప స్మృతులనున్నా వీరు ఖండించగలరు.

( వీరువ్రాసిన శ్లోకములలో )

( స్మృత్యర్థసారే )

శ్లో॥ ప్రథమోయాజ్ఞవల్క్యచ। ఆపస్తంబోద్వితీయకః।
ఆశ్వలాయనస్తృతీయశ్చ। సత్యాషాఢశ్చతుర్థకః।
పంచమోమూలఘటికో। షష్ఠోవాజసనేయికః।
సప్తమోహిరణ్యకేశీ। అష్టమస్తుభారద్వాజః।
నవమోవైఖానసఃప్రోక్తః। దశమోజైనిబ్రాహ్మణః॥

అని వ్రాయడము వల్ల భారద్వాజులు అష్టమతరగతిలోవారున్నూ, వైఖానసులు నవమతరగతిలోవారున్నూ, అయినారు, గనుక, భారద్వాజుల

కంటె వైఖానసులు, అధమతరగతిలోవారని, వీరియభిప్రాయముగదా॥

పారక్రమమే ముఖ్యమైనయెడల, ప్రథమతరగతిలోచేరిన యాజ్ఞవల్క్య బ్రాహ్మణులకంటె ఆపస్తంబాది బ్రాహ్మణులు అధమతరగతిలోవారు కావలెను.

—( ఉదాహరణము )—

శ్లో॥ శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వదళయోః॥

అని యుండుటచేత భరతులకంటే శత్రుఘ్నులు జ్యేష్ఠులు కావలసి యుండగా కనిష్ఠులైనారు. యిందుకుదుష్టతావాదులుజవాబుచెప్పవలెను వీరువ్రాసిన శ్లోకములలోనే

—(దేవలకలక్షణం స్మృత్యంతేగౌతమేన)—

శ్లో॥ దేవార్చనపరోవిప్రః। విత్తార్థంవత్సరత్రయం।
సవై దేవలకోనామ। హవ్యకవ్యేషువర్జితః॥

ధనార్థియై మూడుసంవత్సరములు దేవతార్చనచేసినవిప్రుడు దేవలకుడని యీ శ్లోకార్థముకదా అనేకసత్రములలోనున్నా, అనేక బ్రాహ్మణోద్యోగస్థుల గృహములయందున్నా నెలకు రు 3, 4 మూడు నాలుగు రూపాయలచొప్పున జీతముపుచ్చుకుంటూ దేవతార్చనచేస్తూ దేవతార్చనబ్రాహ్మణుడని ప్రసిద్ధిపొందుతూవున్న బ్రాహ్మణులందరున్నూ యీదుష్టతావాదులకు బంధువులైయున్నారు. వీరిదేవలకత్వం యేలాగు నివర్తించును.

మహదతిక్రమః। కార్త్స్న్యేనాత్మనిఫలతి॥

అనేన్యాయముచేతను వీరికే దేవలకత్వము సిద్ధించినది. యిందుకున్నూ వీరు జవాబు చెప్పవలెను.

—( సిద్ధాంతము )—

ధర్మశాస్త్రములు. సాత్వికములు, రాజసములు, తామసములు అని మూడువిధములు—

యీలాగునసే పురాణములున్నూ మూడువిధములు తామసస్మృతి కంటె రాజసస్మృతి ప్రబలప్రమాణము. రాజస తామసముల కంటె సాత్వికస్మృతి పరమప్రమాణము.

(యిందుకు నిదర్శనము.)

(స్మృతిరత్నాకరే)

శ్లో॥ సాత్వికై రేవవర్తేత సాత్వికోక్తం సమాచరేత్।
రాజసం తామసం చైవ। దూరతః పరివర్జయేత్॥

(శ్రీవిష్ణుధర్మోత్తరే)

శ్లో॥ మధ్యమోరాజసోధర్మః తామసస్త్వధమస్మృతః।
సాత్వికస్తూత్తమోజ్ఞేయః। తస్మాత్సాత్వికమాచరేత్॥

(కించ)

శ్లో॥ శ్రుతిస్మృత్యోర్విరోధేతు। శ్రుతిరేవబలీయసీ।
అవిరోధేసదా కార్యం। స్మార్తం వైదికవత్సదా॥

యీలాగునసే స్మృతిపురాణములకు విరోధముకలిగినప్పుడు స్మృతి వాక్యమే ప్రబలప్రమాణము గనుక సాత్వికమైన హారీతస్మృత్యాది శ్లోకములవల్ల తామసపురాణశ్లోకములు ఖండించబడినవని తెలుసుకోవలెను. విశేషించి దేవలకత్వము కంఠగతామకపిద్ధమువలె దుష్టతావాదులను బాధించుచున్నది. వైఖానస శిష్టలనుగూర్చి శతశః ప్రమాణములున్నవి. పండితంమన్యులకు యెన్నిప్రమాణములుకనుపరచినసూ బధిరగాంధర్వగీతమువలె నిష్ప్రయోజనము గనుక (అలమస్థాన సంరంభేణ) అను న్యాయముచే నింతటితో విరమించడమైనది.

| | |
|---|---|
| ది 21-2-1902. | ద॥ రాజా వత్సవాయి |
| పెద్దాపురం. | రాయజగపతిరాజుగారు. |

# ప్రకటన.

1. శ్రీ వైఖానస ధర్మచంద్రిక. 2. వైఖానసారోపిత దేవలకత్వనిరాకరణము. (ఏకసంపుటము.) 0-3-0.

ఈ గ్రంథములు రెండును, పెద్దాపురము నివాసు లగు మ. రా. రా. శ్రీ శ్రీరాజా వత్సవాయి శ్రీరాయజగపతిరాజా బహద్దరువారిచే వ్రాయబడినవి.

1. బ్రహ్మాండపురాణము అర్థపంచకవివరణము. 1-0-0.
2. శ్రీవైఖానసోత్పత్తి. 0-2-0.
1. శ్రీవైఖానస చరిత్రము. ప్రథమభాగము. ఇవి 0-2-0.

యానాం. శ్రీమాన్ గాడిపల్లి కృష్ణమాచార్యులు వారి వలన వ్రాయబడినవి.

వలయువారు:— గోదావరిజిల్లా, పిఠాపురం వాస్తవ్యులు పెద్దింటి లక్ష్మణాచార్యులువారికి గాని—

గోదావరిజిల్లా, రామచంద్రపురం తాలూకా, కొమరిపాలెం, పెద్దింటి నారాయణాచార్యులకు గాని—

వ్రాసిన బడయగలరు.